# కైవల్యోపనిషత్తు

## శాంతి మంత్రం

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్య జత్రాః ।

స్థిరైరంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః । వ్యశేమ దేవహితం యదాయుః ॥

స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః ।

స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః శాంతిః ॥

ఓ దేవతలారా ! మా చెవులు మంగళకరమైనవిషయములే వినుగాక ! మా కళ్లతో శుభాన్నే చూస్తాంగాక ! మీ స్తోత్రాలను గానం చేస్తూ మాకు నియమితమైన ఆయుష్కాలాన్ని పరిపూర్ణమైన ఆరోగ్యంతో, బలంతో గడుపుతాం గాక ! శాస్త్రప్రశంసితుడైన ఇంద్రుడు, సర్వజ్ఞుడైన సూర్యుడు, ఆపదలనుండి రక్షించే గరుత్మంతుడు, మా బ్రహ్మవర్చస్సును పాలించే బృహస్పతి మాకు శాస్త్రాధ్యయనంలో , అందు చెప్ప బడిన సత్యానుష్ఠానంలో అభ్యుదయాన్ని ప్రసాదించు గాక !

అథాశ్వలాయనో భగవంతం పరమేష్ఠిన ముపసమేత్యోవాచ।

అనంతరం అశ్వలాయనుడు పరమాత్ముడైన బ్రహ్మదేవుని సమీపించి ఇట్లనెను.

అధీహి భగవన్! బ్రహ్మవిద్యాం వరిష్ఠాం
సదా సద్భిః సేవ్యమానాం నిగూఢామ్।
యయాఽచిరాత్ సర్వపాపం వ్యపోహ్య
పరాత్పరం పురుషం యాతి విద్వాన్॥ 1

హే భగవాన్! ఉన్నతమైనది సదా సజ్జనులచే ఆచరింపబడునది, గోప్యమైనది, దేనిని అనుష్ఠించడం వల్ల సర్వపాపములు తొలగి పండితుడు పరాత్పరుని చేరగలడో ఆ బ్రహ్మ విద్యను నాకు ఉపదేశము చేయుము.

తస్మై స హోవాచ పితామహశ్చ
శ్రద్ధా భక్తి ధ్యానయోగాదవైహి ॥ 2

బ్రహ్మపితామహుడు అశ్వలాయునికి ఈ విధంగా తెలిపెను, 'ఆ బ్రహ్మ విద్యను అత్యంత శద్ధా, భక్తి, ధ్యానయోగములద్వారా బాగుగాగ్రహించ గలవు'

న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగే నైకేన అమృతత్వ మానశుః
పరేణ నాకం నిహితం గుహాయాం
విభ్రాజతే యద్యతయో విశన్తి ॥ 3

కర్మవల్ల, సంతానమువల్ల, ధనమువల్ల అమృతత్వము లభించదు. త్యాగము ద్వారానే అమృతత్వము లభ్యము కాగలదు. స్వర్గమునకు మిన్నయై హృదయ కుహరంలో ప్రకాశిస్తున్న ఆ పరమాత్మను యతీశ్వరులు పొందగలరు.

వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః
సంన్యాస యోగాద్యతయః శుద్ధ సత్వాః
తే బ్రహ్మ లోకేషు పరాన్తకాలే
పరామృతాత్ పరిముచ్యన్తి సర్వే॥ 4

వేదాంత విజ్ఞాన సూక్ష్మాలను గ్రహించి సంన్యాస యోగము ద్వారా పరిశుద్ధమైన అంతః కరణకలిగిన యతీశ్వరులు బ్రహానుభూతితో జీవభావము సంపూర్ణముగా నశించిన పిదప బంధ విముక్తులై అమృతత్వ స్థితిని పొందుదురు.

వివిక్తదేశే చ సుఖాసనస్థః
శుచిః సమగ్రీవ శిరః శరీరః
అత్యాశ్రమస్థః సకలేంద్రియాణి నిరుధ్య
భక్త్యా స్వగురుం ప్రణమ్య
హృత్పుండరీకం విరజం విశుద్ధం
విచిన్త్య మధ్యే విశదం విశోకమ్ 5

ఏకాంతప్రదేశంలో సుఖాసీనుడై, మెడ శిరస్సు, శరీరమును నిటారుగా, సమంగా ఉంచి, శుచితో దేహాత్మ భావం లేకుండ సమస్త ఇంద్రియాలను నిరోధించి, భక్తితో తన గురువుకి నమస్కరించి నిర్మలము, శుద్ధము, శోకరహితము అయిన హృదయపద్మంగా భాసిస్తున్న ఆ పరమాత్మని ధ్యానించాలి.

అచిన్త్య మవ్యక్త మనన్త రూపం
శివం ప్రశాంత మమృతం బ్రహ్మయోనిమ్।
తథాది మధ్యాన్త విహీన మేకం
విభుం చిదానంద మరూపమద్భుతమ్॥ 6

ఆ ఆత్మస్వరూపం- అచింత్యము,అవ్యక్తం, అనంతం , మంగళం, ప్రశాంతం, అమృతం, బ్రహ్మకంటే సనాతనమైనది, ఆది, మధ్య, అంతములేనిది, ఏకము, సర్వము వ్యాపించినది, చిదానందమైనది, రూపములేనిది, అద్భుతమైనది.

ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం
త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్
ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం
సమస్త సాక్షిం తమసః పరస్తాత్ 7

ఉమాసమేతుడు, పరమేశ్వరుడు, పభువు, ప్రశాంతుడు, త్రిలోచనుడు, నీలకంఠుడు, అయిన పరమశివుని ధ్యానించిన ముని సమస్తమునకు సాక్షి అవుతున్నాడు.

స బ్రహ్మ స శివః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్
స ఏవ విష్ణు స ప్రాణః స కాలోఽగ్నిః స చంద్రమాః 8

అతడే - బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు,విష్ణువు, నాశరహితుడు, పరమ స్వరాట్, ప్రాణము,అగ్ని చంద్రుడు మరియు కాలము.

స ఏవ సర్వం యద్భూతం యచ్చభవ్యం సనాతనమ్ ।
జ్ఞాత్వాతం మృత్యుమృత్యేతి నాన్యఃపంథా విముక్తయే ॥ 9

భూతకాలంలో ఏది ఉందో, భవిష్యత్ కాలంలో ఏది వుండగలదో అది ఆ నిత్యమైన బ్రహ్మయే, నిత్యతత్వమైన బ్రహ్మను తెలుసుకొని మృత్యువును అధి గమిస్తున్నాడు. ముక్తికి ఇంత కంటే వేరే మార్గము లేదు.

సర్వభూతాస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని।
సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా॥ 10

సమస్తభూతములను తనలోను, తనను సమస్త భూతములలోను దర్శిం చువాడు, ఆ పరబ్రహ్మను చేరుచున్నాడు. ఇది తప్ప వేరే మార్గము లేదు.

ఆత్మాన మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।

జ్ఞాననిర్మథనాభ్యాసాత్ పాశం దహతి పండితః॥ 11

జీవాత్మభావము క్రింది అరణిగా, ఓంకారము పై అరణిగా చేసే జ్ఞానమార్గ మును అభ్యసించే పండితుడు ఆ జ్ఞానం ద్వారా సమస్త బంధములను దహింప చేయుచున్నాడు.

యజ్ఞం నిర్వహించే సమయంలో అగ్ని ప్రజ్వలించడానికి ఒక ప్రక్రియ ఉంటుంది. ఒక చిన్నగుంట ఉన్న చెక్కను కదలకుండా ఉంచి, దానిలో ఇంకొక పొడవైన చెక్కను కవ్వంలా ఉంచి చిలుకుతారు. వాటి మధ్య ఘర్షణ వలన అగ్ని పుడు తుంది. ఆ చెక్కలనే 'అరణి' లు అంటారు.

స ఏవ మాయా పరిమోహితాత్మా
శరీరమాస్థాయ కరోతి సర్వమ్ ।
స్త్రీయన్న పానాది విచిత్ర భోగైః
స ఏవ జాగ్రత్ పరితృప్తి మేతి ॥ 12

అతడే మాయవల్ల ఈ శరీరమును ధరించి జీవుడుగా సమస్త కార్యము లను చేయుచున్నాడు. జాగ్రదవస్థలో ఆ జీవుడే - స్త్రీ, అన్న పానాదులతో రక రకాల భోగములను అనుభవిస్తు దానితోనే తృప్తి పొందుతున్నాడు.

స్వప్నే స జీవః సుఖదుఃఖ భోక్తా
స్వమాయయా కల్పిత జీవ లోకే
సుషుప్తికాలే సకలే విలీనే
తమోఽభిభూతః సుఖరూపమేతి 13

స్వప్నమందు ఈ జీవుడే తన మాయతో సృష్టించుకొన్న స్వాప్నికలోక ములో సుఖదుః ఖాలను పొందుతున్నాడు. సుషుప్తిలో సర్వము విలీనమైనప్పడు తమస్సుచే సుఖరూపంలో ఉన్నాడు

పునశ్చ జన్మాంతర కర్మయోగాత్
స ఏవ జీవః స్వపితి ప్రబుద్ధః ।
పురత్రయే క్రీడతి యశ్చ
జీవ స్తతస్తు జాతం సకలం విచిత్రం ॥
ఆధారమానంద మఖండబోధం
యస్మిన్‌లయం యాతి పురత్రయం చ ॥ 14

మళ్ళీ ఆ జీవుడే జన్మాంతర కర్మయోగము వల్ల నిద్రించి మేల్కొను చున్నాడు. ఈ విధంగా మూడు పురములలో ఆ ఆత్మ క్రీడించుచున్నది. ఆత్మ

నుండే విచిత్రమైన సకలజగత్తు ఉత్పన్నమౌతోంది. మూడవస్థలకు అతడే ఆధారం, అఖండజ్ఞానస్వరూపుడు, అతనిలోనే మూడవస్థలు లయమౌతున్నాయి.

ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథ్వీ విశ్వస్య ధారిణీ ॥ 15

ఈ ఆత్మనుంచే ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, విశ్వము, భూమి అన్నీ ఉద్భవించాయి.

ముముక్షువులకు గమనిక : 16 నుంచి 20 వరుకు ఉన్న మంత్రాలలో - మహావాక్యాలున్నాయి. ఇవి ఉపాసనా యోగ్యమైనవి.

యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్ ।
సూక్ష్మా త్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్ ॥ 16

ఏది పరబ్రహ్మమో, ఏది అన్నిటా ఆత్మగా భాసిస్తోందో, ఏది విశ్వానికి ఆధారభూతమో, ఏది సూక్ష్మం కంటే సూక్ష్మమో, ఏది శాశ్వతమైనదో అదే నీవు, నువ్వే అది.

జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ ప్రకాశతే ।
'తద్ బ్రహ్మాహ' మితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥ 17

జాగ్రత్ స్వప్న సుషుప్తి ప్రపంచములలో ఏది సమస్తమై భాసింపచేయు చున్నదో ఆ బ్రహ్మనే నేను అని తెలుసుకుంటే సమస్త బంధముల నుండి విముక్తుడగుచున్నాడు.

త్రిషుధామసు యద్భోగ్యం భోక్తాభోగశ్చ యద్భవేత్ ।
తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥ 18

మూడు అవస్థలలోను భోగ్యం, భోక్తా, భోగరూపంలో దానికి భిన్నమైనవాడిని, సర్వసాక్షిని, చిద్రూపుడను, సదాశివుడను.

మయ్యేవ సకలం జాతం మయి ప్రతిష్ఠితమ్ ।
మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్ ॥19

నా యందే సమస్తం పుట్టి, నా యందేయుండి , నాలోనే సర్వం లయమవుతున్నాయి. ఆ అద్వైత బ్రహ్మను నేనే.

అణోరణీయానహమేవ
తద్వన్మహానహం విశ్వమహం విచిత్రమ్।
పురానోహం పురుషోహమీశో
హిరణ్మయోహం శివరూపమస్మి ॥ 20

నేను అణువుకంటె అణువును. మహత్తు కన్నా మహత్తును. నేను ఈ విచిత్రమైన విశ్వాన్ని . సనాతనుడను. పురుషుడను. ఈశ్వరుడను. హిరణ్మయుడను. శివుడను.

అపాణిపాదోహ మచింత్యశక్తిః
పశ్యామ్యచక్షుః స శృణోమ్యకర్ణః।
అహం విజానామి వివిక్తరూపో
న చాస్తి వేత్తామమ చిత్సదాహమ్ 21

నాకు కాళ్ళు చేతులు వుండవు అయినా జగద్వ్యాపారములన్ని చేయుచుందును. నా శక్తి ఆలోచనకి అందనిది. కళ్ళులేకుండానే నేను చూచుచుందును. చెవులు లేకుండా వినుచున్నాను. సమస్తము నాకు విదితము. నన్ను పూర్తిగా తెలుసుకొన్నవాడు లేడు. నేను సదా చైతన్యస్వరూపుడను.

వేదైరనేకై రహమేవ వేద్యో
వేదాంతకృద్వే దవిదేవ చాహమ్।
న పుణ్య పాపే మమ నాస్తినాశో
న జన్మదేహేంద్రియ బుద్ధిరస్తి 22

సమస్త వేదములచేత తెలియబడుబ్రహ్మను నేనే, వేదములను, వేదాంతములైన ఉపనిషత్తులను శ్రుతిగా అందించినది నేనే. వేదవిదుడను నేనే. నాకు పుణ్యము, పాపములు లేవు. నాకు నాశములేదు. జన్మలేదు. నాకు దేహేంద్రియ భావములు లేవు.

నభూమిరాపో న చ వహ్నిరస్తి
న చాఽనిలో మేఽస్తి న చాంబరం చ ।
ఏవం విదిత్వా పరమాత్మ రూపం
గుహాశయం నిష్కల మద్వితీయమ్ ॥ 23

## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన అర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) అర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

### Scriptures, Slokas and Stotras

- Adi Sankaracharya
- Aditya
- Adwaitam
- Ayyappa
- Bhagavad Geetha
- Bammera Pothana
- Bhagavatam
- Brahma Sutras
- Durga
- Dattatreya
- Ganesh
- Gayatri
- Guru
- Hanuman
- Hindu Marriage System
- Krishna
- Lakshmi
- Mahabharat
- Mantrapushpam
- Narada Bhakti Sootralu
- Nava Grahas
- Patanjali Yoga Sootralu
- Raghavendra
- Rama
- Ramayanam
- Rama Geeta
- Saraswathi
- Sandharbha
- Satya Sai
- Shirdi Sai
- Siva
- Slokas with meaning
- Subrahmanya
- Suktas
- Sundara Kanda
- Venkatesa
- Vishnu
- Vratas
- Upanishads
- Rigveda
- Samhitaanuvadam
- (Yoga Paranga)
- Vyasa Bhagavatam

### General

- Appeal and Objectives
- Bala Basha
- Bhakti Celebrities
- Bhakti Classicals
- Bhakti Links
- Book Reviews
- Jeji Mamayya Patalu
- Chatuvulu
- Dasa Mudrani
- Divine Guidance of Satya Sai
- Kavitha Kadambam
- Keerthanalu
- Koonalamma Padalu
- Prasnalu - Javaabulu
- Naturopathy
- Rishi Vani
- Sai Krishna's Art
- Satakalu
- Swamiji
- Tatvalu
- Telugu Special
- Useful Links
- Value Education
- Web Hunt
- Hindu Cultural
- Questions & Answers
- Yoga
- Yoga Mudralu Bandhalu
- Yogasanas (Detailed)

### Downloads

- Audio Downloads
- Bhakti Screen Savers
- Printer Friendly Page

#### Pravachanaalu

- Bhaja Govindam
- Bhasmo Dhulita Vigrahaya
- Karma Siddhantam
- Class Prayers
- Kenopanishad
- Sri Narasimha Charitram
- Soundarya Lahari
- Ramana Saranagathi
- Vivekachoodamani

#### Specials

- Annamayya Pada Visleshana
- Monthly
- Satsang
- Chinna Kathalu
- Class Prayers
- Human Relations
- Nadiche Devudu
- Stories of Alwars
- Stories of Bhaktas
- Stories of Indian Sages
- Stories of Nayanars
- Sankara Vangmayamu
- Special Articles
- Hinduism and Mantras
- Personality Development

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

సమస్త సాక్షిం సదసద్విహీనం
ప్రయాతి శుద్ధం పరమాత్మ రూపమ్॥ 24

నాకు భూమి, నీరు, అగ్ని, ఆకాశము, వాయువు ఏదీలేదు. నిష్కళుడను. అద్వితీయుడను, సర్వసాక్షిని, సదసద్విహీనుడను, అట్టి నన్ను సంపూర్ణముగా తెలుసుకొన్నవాడు, శుద్ధమగు నారూపమునే పొందుచున్నాడు.

యశ్శతరుద్రీయమధీతే
సోఽగ్నిపూతే పూతో భవతి । సురాపానాత్ పూతో భవతి ।
బ్రహ్మహత్యాత్ పూతో భవతి। కృత్యాకృత్యాత్
పూతో భవతి । తస్మాదవిముక్త మాశ్రితో భవతి।
అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్ ॥ 1

ఈ కైవల్యోపనిషత్తును ఎవరు అధ్యయనమొనరించుచున్నాడో, నూరు మార్లు రుద్రపారాయణ చేసిన వాడగుచున్నాడు. అతడు అగ్నిపూతుడగుచున్నాడు. సురాపాన దోషము నుండి పవిత్రుడగు చున్నాడు. బ్రహ్మహత్యా దోషమునుండి విముక్తుడగుచున్నాడు. కృత్యాకృత్యముల నుండి పవిత్రుడగుచున్నాడు. కాబట్టి అట్టివాడు ఆ చైతన్య తత్త్వమును వదలకుండా ఉండేవానిని ఆశ్రయిస్తున్నాడు. ఆశ్రమాలకు అతీతుడై ఈ కైవల్యోపనిషత్‌ను సదా జపించవలెను.

అనేన జ్ఞానమాప్నోతి సంసారార్ణవ నాశనమ్
తస్మాదేవం విదిత్వైవం కైవల్యం
ఫలమశ్నుతే, కైవల్యం ఫలమశ్నుత ఇతి॥ 2

దీని వల్ల భవసాగరమును దాటే జ్ఞానమును పొందుచున్నాడు. ఈ విధంగా ఆత్మానుభూతిపొంది కైవల్యమును పొందుచున్నాడు.

For further study and deep understanding Read Kaivalya Upanishad by Swamy Chinmayananda.

The book is Available in all center of Chinmaya Mission Trust.

**Published by**
**Central Chinmaya Mission Trust**
**Sandeepany Sandhyalaya**
**Saki Vihar Road**
**Mumbai 400072**

